# వేదోద్ధారకుడు

## మహర్షి దయానంద సరస్వతి (1824 - 1883)



# దయానంద సరస్వతి

ఆర్యసమాజ సంస్థాపకుడు.
హిందూమతం యొక్క
సహజమైన తేజస్సును,
ప్రాభవాన్ని పునరుద్ధరించిన
మహర్షి. నిర్భయుడైన సంఘ
సంస్కర్త. తనమీద
విషప్రయోగం చేసిన మనిషినే
కాపాడిన మహనీయుడు.
ఎల్లలెరుగని మంచితనం,
మూర్తీభవించిన వ్యక్తిత్వం
ఆయన సొత్తు.

దాదాపు 150 సంవత్సరాల క్రిందట జరిగిన సంఘటన ఇది. ప్రస్తుతం గుజరాత్ రాష్ట్రమని పిలువబడుచున్న సౌరాష్ట్రంలో ఎన్నో చిన్నచిన్న రాజ్యాలుండేవి. వాటిలో మోర్వీ ఒకటి. ఈ రాజ్యంలోనిదే టంకారా అనే పట్టణం. అక్కడ కర్షన్‌జీ లాల్‌జీ తివారి అనే సంపన్నుడైన బ్రాహ్మణుడు ఉండేవాడు. టంకారాకు అతడే తహసీల్దారుకూడా. మోర్వీ పాలకుడు ఆయన రక్షణ కోసం, ఆయన గౌరవార్థం కూడా ఒక చిన్న అశ్వికదళాన్ని ఆయనకు బహూకరించాడు.

కర్షన్‌జీ సదాచార సంపన్నుడు, న్యాయబుద్ధి కలవాడు. అన్నింటిలోనూ ఉదారంగా వ్యవహరించేవాడు. అనాది కాలం నుంచీ పరంపరగా సంక్రమించిన ధార్మిక ఆచార వ్యవహారాలలో విశ్వాసం కలిగినవాడు. ఆయన సతీమణి అమృతబాయి సౌందర్యవతి, సౌశీల్యఖని. గ్రామవాసులందరికీ ఆమె తల్లి వంటిది. ఈ దంపతులకు 1824లో ఒక కుమారుడు జన్మించాడు. ఆ పిల్లవానికి మూలశంకరుడని వారు నామ కరణం చేసారు. అక్కడి ఆచారం ప్రకారం, ఆ బాలుణ్ణి

దయారాం అనే మరో పేరుతో కూడా పిలుస్తుండేవారు. ఆ బాలుడే తర్వాత మహర్షి దయానందుడుగా ఖ్యాతి గాంచాడు.

అయిదేండ్ల వయసు రావడంతో మూలశంకరుడి చదువు మొదలైంది. ఎనిమిదవ ఏట అతనికి ఉపనయన సంస్కారం జరిగింది. సంధ్యావందనం వంటి ధార్మిక ఆచారాలను ఆ బాలుడు భక్తిశ్రద్ధలతో ఆచరిస్తుండేవాడు. అతనికి మంచి జ్ఞాపకశక్తి ఉండేది. పద్నాలుగేండ్ల వయసు వచ్చేనాటికి యజుర్వేదాన్ని, శాస్త్రాలను, ఉపనిషత్తులను పుక్కిట బట్టాడు.

తన మాదిరిగానే తన కుమారుడు కూడా పరమ శివుని భక్తుడై తన అడుగుజాడల్లో నడవాలని కర్షన్‌జీ కోరిక. కనుక అప్పుపడప్పుడు పరమశివుని మహత్యాలను గురించి వివరిస్తుండేవాడు. పండుగరోజుల్లో శివారాధన చేసిన తర్వాతనే అన్నపానీయాలు ముట్టుకోవాలని బాలునికి చెబుతుండేవాడు.

మూలశంకరుడికి ఒక పినతండ్రి ఉండేవాడు. ఆయనంటే ఆబాలునికి చాలా ఇష్టం. ఆయన మహా విద్వాంసుడు, ధర్మతత్పరుడైన నిరాడంబర వ్యక్తి. ఆయన ప్రభావం పిల్లవాడి మీద గాఢంగా పడింది. సునిశితమైన బుద్ధి, అసాధారణమైన

జ్ఞాపకశక్తి ఉన్న మూలశంకరుడు ఏదో ఒకనాటికి గొప్ప వ్యక్తి అవుతాడని పినతండ్రి ఊహించాడు.

## నాకోసం కాదు ఈ జీవితం

ఆరోజు శివరాత్రి. రాత్రి అంతా జాగారణ చేసి పరమశివుణ్ణి ఆరాధించేందుకు భక్తులతో శివాలయంలోకి చేరారు. మూలా (మూలశంకరుడు) కూడా తండ్రితోపాటు వెళ్ళాడు. శివపూజ చేస్తున్న భక్తులంతా అర్ధరాత్రికల్లా ఒక్కొక్కరుగా నిద్రలోకి జారుకున్నారు. మూలా మాత్రం శివరాత్రి పూజ నియమాన్ని ఉల్లంఘించకూడదని నిశ్చయించుకుని శివలింగంవైపే తదేకంగా చూస్తూ కూర్చుండిపోయాడు.

అది అర్ధరాత్రి సమయం. శివలింగం ప్రక్కనే ఒక జ్యోతి మసక మసకగా వెలుగుతోంది. సరిగ్గా అప్పుడే ఎక్కడి నుంచో గానీ కొన్ని ఎలుకలు ప్రత్యక్షమైనాయి. శివలింగం ముందు నివేదించబడి ఉన్న ప్రసాదాలన్నింటినీ అవి ఆరగించి శివలింగంమీదనే నిర్భయంగా తైతక్కలాడాయి.

మూలా ఆశ్చర్యంతో చూస్తుండిపోయాడు. అతని మనసును

ఆలోచనలు చుట్టుముట్టాయి. ఏమిటి ఇదంతా? శివుడు సర్వ శక్తిమంతుడని, శక్తి కేంద్రమే శివుడని తండ్రి చెబుతుండేవాడే, మరి ఎలుకలు తన మీద ఎక్కి అటూ ఇటూ తిరుగాడుతూ గంతులువేస్తుంటే ఈ శివలింగం మిన్నకుండిపోయిందేమిటి? బాలుని మనసులో సంశయం అలుముకుంది. ఏమిచేయాలో పాలుపోక, తండ్రిని నెమ్మదిగా తాకి లేపి నాన్నగారూ! మీరు నాకు చెప్పిన మహదేవుడు ఇదేనా? లేక ఈ లింగం మరేదైనా పదార్థమా? అన్నాడు.

తండ్రి కోపంతో మండిపడుతూ ఏమిరా? నీవు నాస్తికుడి మాదిరిగా మాట్లాడితే నీ నోరు పడిపోతుంది. ఈ శివలింగమే మహాశివుడు అనేందుకు సందేహమేమీలేదు అన్నాడు. పిల్లవాడు మళ్ళీ మృదువుగా 'కానేకాదు నాన్నగారూ! మీరు చెప్పే శివుడు జీవశక్తియే, కానీ ఈ శివలింగం మాత్రం అచరమైన జడపదార్థం మాత్రమే' అన్నాడు.

ఈ జవాబు విని తండ్రి కోపం ఇంకా ఎక్కువయింది. అయితే తన కుమారుడు చెబుతున్నది తర్కబద్ధంగా ఉంది. వారి సంభాషణ కొనసాగింది.

తండ్రి : నాయనా! నీవు చెప్పేది నిజమే, ఇదొక విగ్రహమే కానీ శివుడు కాదు.

మూలశంకరుడు : మరైతే శివునికి బదులుగా ఈ విగ్రహాన్ని ఎందుకు మనం పూజించాలి?

తండ్రి : నాయనా! మానవచరిత్రలోని ఈ కాలంలో, ఈ కలియుగంలో పరమశివుణ్ణి ఆయన యొక్క యదార్థ రూపంలో మానవ మాత్రులెవరూ దర్శించలేరు. కనుక ఈ విగ్రహంలోనే శివుడు నెలకొని ఉన్నాడనే నమ్మకంతో ఆయనను ఆరాధించినట్లయితే ఆయన సంతోషించి, మనకు మోక్షాన్ని ప్రసాదిస్తాడు.

మూలశంకరుడు : అలాగైతే ఆయనను పూజించామని భావిస్తే కూడా సరిపోతుంది కదా! విగ్రహాన్ని పూజించడం దేనికి?

ఈ ప్రశ్నకు కర్షన్‌జీ వద్ద సమాధానం లేదు. పిల్లవాని మనసు మాత్రం సందేహంతో నిండిపోయింది.

ఒకసారి టంకారాలో కలరా వ్యాపించింది. పధ్నాలుగేళ్ళ వయస్సున్న మూలశంకరుని చెల్లెలు కలరాకు బలైపోయింది.

తల్లిదండ్రులు, అన్నలు బంధువులు అంతా ఎంతో బాధపడి దుఃఖించారు. మూలశంకరుడు ఒక్కడు మాత్రం ఏడవనేలేదు. అతడు సోదరి మృతదేహం ప్రక్కనే కూర్చొని దానివంకే తదేకంగా చూసాడు. అయితే ఆ ఆకస్మిక మరణం అతనిలో ఆలోచనలు రేపింది. చూడవచ్చినవారు ఎంతో మంది "అబ్బా! ఎంత హృదయం లేని మనిషో ఇతడు!" అన్నారు.

కాలక్రమంలో అందరూ ఆ బాలిక మరణం గురించి మరచిపోయారు. అందరిచేత హృదయంలేనివాడని ముద్ర వేయించుకున్న మూలా మాత్రం ఆ సంఘటనను మరచి పోలేదు. మృత్యువు అనేది అతనికి ఒక చిక్కు ప్రశ్నగానే మిగిలి పోయింది.

ఆ సంఘటన జరిగిన మూడేళ్ళకే మూలశంకరుడికి ప్రేమ స్వరూపుడైన పినతండ్రి కలరాతో మరణించాడు. మూల శంకరుడికి ఇదొక తీవ్రమైన అఘాతం. జీవితంలో అంతా పోగొట్టుకున్నట్లుగా అనిపించిందతనికి. ఈసారి మాత్రం మూలా వెక్కివెక్కి ఏడ్చాడు. అతని ఏడుపు రాతిని సైతం కరిగించేదే.

చెల్లెలి మరణం అతనిని ప్రాపంచిక జీవితానికి విముఖునిగా చేసింది. పినతండ్రి మరణంతో ఈ వైరాగ్యం మరింత గట్టిపడింది. ప్రాపంచిక సుఖాలకు తాను లొంగకూడదని శాశ్వతంగా నిలిచేది ఏదో దానినే పొందాలనే కోరిక అతని మనసులో లోతుగా నాటుకుంది.

## ఇంటినుంచి నిష్క్రమణం

కుటుంబ బంధాలను తెంచుకోవాలనే కోరిక మూల శంకరునిలో పెరిగింది. జీవితమంటే ఏమిటి? మృత్యువంటే ఏమిటి? ఎవరైనా పరిపూర్ణ సిద్ధ పురుషుని నుంచి ఈ ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవాలనుకున్నాడు. ఈ లక్ష్యాన్ని మనసులో ఉంచుకుని యోగ్యుడైన గురువును వెదికే నిమిత్తం ఇల్లు వదలాలని నిశ్చయించుకున్నాడు మూలశంకరుడు.

అతనిలో పెరుగుతున్న నిస్సంగత్వాన్ని తల్లిదండ్రులు గమనించారు. ఇంటినుంచి పారిపోయి సన్యాసుల్లో కలుస్తాడని భయపడ్డారు. త్వరలో ఇతనికి వివాహం చేయాలని నిశ్చయించారు. పెళ్ళికూతురును ఎంపిక చేయటం కూడా అయింది. యధావిధిగా పెళ్ళి ఏర్పాట్లు ప్రారంభమయినాయి. మూల శంకరుడు ఏమాత్రం ప్రతికూలత చూపలేదు. దానితో తమ

కుమారుడు పెళ్ళికి ఇష్టపడుతున్నట్లేనని భావించి సంతోష పడ్డారు. అయితే మూలశంకరుడి మనస్సు కుటుంబ జీవితాన్ని పరిత్యజించాలనే స్థిర నిర్ణయంతో ఉంది.

ఒక రోజున చీకటి పడుతూ ఉండగా మూలశంకరుడు తన గదిలోనుంచి బయటకు వచ్చాడు. విశాలమైన వసారాలో నిలిచి తమ సంపన్న గృహం వంక ఒక క్షణం అలాగే చూసాడు. ఉన్నచోటునే మనసులో తల్లిదండ్రులకు ఇతర పెద్దలకు కడసారిగా ప్రణామాలు సమర్పించాడు. అతని హృదయం భారమైంది. కన్నులు బాష్పపూరితాలైనాయి. ఈ ఇంటిలో మళ్ళీ ఎన్నడూ అడుగు పెట్టను అని మనసులో అనుకుని బయటకు వెళ్ళిపోయాడు. ఆ సమయంలో మూలశంకరుడి వయసు ఇరవైయ్యొక్క సంవత్సరాలే. తన కుమారుణ్ణి తిరిగి ఇంటికి తీసుకురావాలని కర్షన్‌జీ చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు.

## గురువు కోసం అన్వేషణ

ఇల్లువదిలిన మీదట మూలశంకరుడు గురువుకోసం అన్వేషిస్తూ అహ్మదాబాద్, బరోడా, హరిద్వార్, కాన్పూర్, కాశీ మొదలైన చోట్లకు ప్రయాణించాడు. కొండల్లోనూ, కోనల్లోనూ,

అడవుల్లోనూ తిరిగాడు కానీ ఎక్కడా సమర్థులైన గురువు లభించలేదు.

ఇట్టి పరిస్థితులలో మూలశంకరుడికి స్వామి పూర్ణానంద అనే మహా విద్వాంసుడైన సన్యాసి తారసిల్లాడు. స్వామీజీ ఈ యువకునికి సన్యాసదీక్ష ఇచ్చాడు. మూలశంకరుడు స్వామి దయానంద సరస్వతిగా మారాడు.

మహోన్నతమైన హిమాలయ ప్రాంతంలో యోగులను అన్వేషిస్తూ దయానందుడు ఒకచోటునుంచి మరొక చోటుకు సంచరిస్తుండగా ఈయన ప్రాణాలకు పదే పదే ముప్పు ఏర్పడింది. క్రూరమృగాలు సంచరించే కీకారణ్యంలో రాత్రింబవళ్ళు తిరుగాడవలసి వచ్చింది. ఈ సంచార సమయంలో ఆయన ధ్యేయదీక్షకు కూడా పరీక్షలు ఎదురైనాయి.

ఆయన ఓఖీ మఠంలో బసచేసి ఉండగా మఠ నిర్వాహకుడైన మహంత్ ఆయన తేజస్సుకు ముగ్ధుడై ఈ మఠానికి భావి నిర్వాహకునిగా తమరు ఇక్కడే ఉండండి, ఈ ఆశ్రమానికి చెందిన సంపద మొత్తం మీదే అవుతుంది' అన్నాడు. కానీ కోరికలన్నింటినీ త్యజించిన దయానందుడు అయ్యా! నేను

సంపదలనే కోరుకున్నవాడినైతే ఎంతో ధనికుడైన నా తండ్రిగారి గృహాన్ని వదిలివచ్చేవాణ్ణి కాదు. నేను కోరుకునేది ఈ లౌకికమైన సంపదలు కాదు. ఆధ్యాత్మిక జ్ఞాననిధి మాత్రమే అంటూ ఎంతో వినయంగా ఆ ప్రతిపాదనను త్రోసిపుచ్చాడు. ఈ మాటలు అంటూనే ఆచోటు వదలి వెళ్ళిపోయాడు.

దయానందుడు పదేళ్ళు తిరిగినా సమర్థుడైన గురువు ఆయనకు దొరకనేలేదు. దీనితో ఆయనలో నిరాశ నిస్పృహలు అలుముకున్నాయి. ఇక ఆత్మహత్యే శరణ్యమని భావించి, ఒక కొండ శిఖరం మీదకు ఎక్కి అక్కడి నుండి దూకబోతుండగా "పిరికివానిలా చావటానికేనా నీవు ఇల్లువిడిచి వచ్చినది. మృత్యువును జయించడానికి, జ్ఞాన నిధి ఆర్జించడానికే ఇల్లు వదిలావు" అంటూ ఆయన అంతరాత్మ నిలువరించింది. దీనితో దయానందునిలో సరికొత్త శక్తి వచ్చింది. సమర్థుడైన గురువును కనిపెట్టాల్సిందేనని మనసును సుధృడం చేసుకుని కొండ దిగి వచ్చాడు.

అటుపైన పరిపూర్ణ సిద్ధులైన యోగులు నర్మదానది పుట్టుక స్థలం వద్దనున్న దట్టమైన అరణ్యాలలో నివసిస్తారని ఆయనకు

తెలిసింది. దయానందుడు దూరభారాన్ని లెక్కచేయక దక్షిణం వైపు కొన్ని వందల మైళ్ళు నడిచాడు.

నర్మదానది సమీపిస్తుండగా దయానందుడికి ఒక తోటలో పూర్ణాశ్రమస్వామి అనే సన్యాసి దర్శనం లభించింది. ఆయన దయానందుడి దేశాటన గురించిన కథ విని సంతోషించాడు. అంతా విన్న తరువాత 'దయానందగారూ! మీ మనోవాంఛితాన్ని నెరవేర్చగల వ్యక్తి ఈ భూమిమీద ఒకే ఒకరు ఉన్నారు. ఆయన విరజానంద దండీశులు అనే వ్యక్తి. ఆయన మధురలో నివసిస్తుంటారు" అని చెప్పాడు.

దయానందుడికి ఇదో ఆశారేఖగా కనిపించిది. ఎంత మాత్రం జాగుచేయకుండా మధురకు బయలుదేరాడు. 1860 నవంబరు 14న అక్కడకు చేరుకున్నాడు.

## గురు శిష్యుల కలయిక

ప్రజ్ఞాదురంధురుడైన 36 ఏండ్ల సన్యాసి దయానందుడు మధురలో విశ్రాంత్ ఘాట్‌కు వెళ్ళే దారిలో ఉన్న స్వామి విరజానందుని పాఠశాల తలుపు తట్టాడు. లోపలనుండి ఒక గంభీర స్వరం మాట్లాడింది.

విరజానందుడు : నీపేరేమిటి?

దయానందుడు : గురుదేవా! నేను మీ సేవకుణ్ణి, నన్ను దయానంద సరస్వతి అంటారు.

విరజానందుడు : నీకేమి కావాలి?

దయానందుడు : స్వామీ! ఆధ్యాత్మిక జ్ఞానభిక్ష కోసం మిమ్ములను అన్వేషిస్తూ వచ్చాను.

విరజానందుడు : నీకు వ్యాకరణం వచ్చునా?

దయానందుడు : నేను కౌముది, సారసత్వం (సంస్కృత వ్యాకరణంపై రెండు ప్రఖ్యాత గ్రంథాలు) అధ్యయనం చేసాను.

విరజానందుడు : ఏమిటీ? కౌముది, సారసత్వమూనా? ఫో ఇక్కడ నుంచి, పనికిమాలిన పుస్తకాలవి. వాటిని యమునా నదిలో పారేసిరా! అప్పుడే నేను తలుపు తెరుస్తాను.

గురువు ఆజ్ఞాపించినట్లే దయానందుడు యమునా నది వద్దకు వెళ్ళాడు. అప్పటిదాకా దయానందుడు ఆ గ్రంథాలను తలమీద పెట్టుకుని వందల మైళ్ళు ప్రయాణించాడు. అయినా ఇప్పుడు ఈ గ్రంథాలమీద ఏమాత్రం వ్యామోహం లేదు. అంతేకాకుండా వాటిని నదిలోకి విసిరివేసి తిరిగి వచ్చి

'గురుదేవా! మీ ఆజ్ఞను శిరసావహించాను' అన్నాడు. తలుపు తెరుచుకున్నది.

దయానందుడు లోనికి ప్రవేశించాడు. ఎదురుగా విరజానందుడు జింక చర్మంమీద పద్మాసనంలో కూర్చొని ఉన్నాడు. ఎముకలు, చర్మం మాత్రమే అన్నట్లుగా శుష్కించిన దేహంతో ఉన్నప్పటికీ ఆయన ముఖం మాత్రం అసమానమైన తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంది. దయానందుడు ఈ త్యాగ స్వరూపుని పాదాలమీద పడ్డాడు. ఆశీర్వాద సూచికంగా విరజానందుడు దయానందుని శిరస్సును వాత్సల్యంతో స్పృశించాడు.

దయానందుడు తన గురువు వంక ఆశ్చర్యచకితుడై చూసాడు. గురువుకు కన్నులేలేవు. ఒక్క అక్షరమైనా చదువలేదు. అయినప్పటికీ సజీవ రూపాన్ని ధరించిన జ్ఞానమే ఆయన. సకల శాస్త్రాలలోని వచనాలను ఉటంకిస్తూ తన శిష్యుల సందేహాలన్నింటినీ తీర్చగలవాడు. ఇంతటి మహామేధావిని కలుసుకోవటంతో పదిహేను సంవత్సరాలుగా తాను పడిన కష్టాలన్నింటికీ సంపూర్ణంగా ఫలం దక్కినట్లేనని దయానందుడు భావించాడు.

## దయానందుని గురుభక్తి

గురువుపట్ల తనకున్న అసాధారణమైన భక్తితో సేవాభావంతో కొద్దికాలంలోనే శిష్యులందరిలో ప్రేమాస్పదుడైనాడు దయానందుడు. ఎండైనా, వానైనా, చలైనా దయానందుడు ప్రతి ఉదయం యమునానది నుంచి గురువుగారి స్నాన పానాదుల కోసం నీటిని మోసుకొస్తుండేవాడు. నేలను ఊడ్చి ఆశ్రమ ఆవరణను శుభ్రంగా ఉంచే బాధ్యత కూడా ఇతనిదే. ఏరకం పని అయినా ఎంత మాత్రం సంశయించకుండా దయానందుడు చేస్తుండేవాడు. గురువుపట్ల అతనికున్న అసాధారణ భక్తి ప్రపత్తులకు తార్కాణంగా ఎన్నో సంఘటనలున్నాయి.

ఒక సందర్భంగా విరజానందుడు పాఠం చెబుతూ ఉండగా ఆయనకు ఎందువల్లనో దయానందుని మీద కోపం వచ్చింది. అప్పుడు వట్టి ఎముకల మాదిరిగా ఉన్న తన చేతితో ఆయన దయానందుడి వీపుమీద గట్టిగా కొట్టాడు. ఎంత గట్టిగా అంటే ఆ దెబ్బకు గురువుగారి చేయి నొప్పి పెట్టసాగింది. కొంతసేపైన మీదట దయానందుడు గురువును సమీపించి 'గురుదేవా! నా శరీరం పాషాణం మాదిరిగా కఠినమైనది.

ఈవిధంగా కొట్టినందువల్ల దానికేమి దెబ్బతగలదు. దానివల్ల మీ చేతులు నొప్పిపుడతాయి. ఇకమీదట మీరు నన్ను శిక్షించేటప్పుడు మీ చేతిని కాకుండా దయతో బెత్తాన్ని ఉపయోగించండి' అని వినయంగా విన్నవించాడు.

దయానందుడి విన్నపం వ్యర్థం కాలేదు. మరోసారి ఏదో కారణం వల్ల దయానందుడి మీద కోపం రాగా విరజానందుడు అతనిని కర్రతో కొట్టాడు. ఇది చూసిన నయనసుఖుడనే తోటి శిష్యుడు 'గురుదేవా! ఇంత గొప్ప సన్యాసిపట్ల ఈవిధంగా ప్రవర్తించడం తగదు. ఈయనను గౌరవంగా చూడాలి' అన్నాడు. పాఠం అయిన తర్వాత దయానందుడు తన సహాధ్యాయుని అమర్యాదకరమైన ప్రవర్తనపట్ల అభ్యంతరం చెబుతూ 'గురుదేవులు నామీద ద్వేషంతో కొడుతున్నారని అనుకుంటున్నావా! కుమ్మరివాడు మట్టి ముద్దను చూర్ణం చేస్తూ కొడుతూ మలిచిన విధంగానే గురువుకూడా శిష్యుణ్ణి కొట్టి సరిచేయటం ద్వారా అతని వ్యక్తిత్వాన్ని మలుస్తాడు. నీవు ఆవిధంగా మాట్లాడి ఉండవలసింది కాదు' అన్నాడు.

అనంతర కాలంలో దయానందుడు మహర్షి స్థాయిని అందుకుని ప్రజలకు ఆచార్యుడైనపుడు తన భుజంమీద

విరజానందుని దెబ్బలవల్ల ఏర్పడిన మచ్చలను వారికి చూపుతూ నా గురుదేవునికి నేను ఎంతగా ఋణపడివున్నానో ఈ మచ్చలు ఎప్పుడూ నాకు గుర్తుచేస్తుంటాయి అని అంటుండే వాడు.

## కాశీలో ఘన విజయం

విద్యాభ్యాసం పూర్తికాగానే స్వామిదయానందుడు తన గురువు ఆదేశానుసారం ప్రజలకు వైదిక జ్ఞానాన్ని ప్రబోధించే నిమిత్తం పర్యటన చేపట్టాడు. ఆగ్రా, అజ్మీర్, జైపూర్, గ్వాలియర్, మీరట్, హరిద్వార్, కాన్పూర్ మొదలైన చోట్లకు వెళ్ళాడు. అక్కడ పండితులతో శాస్త్రాలనుగురించి వాటి అర్థాలను గురించి తర్కించి వారిపై విజయం సాధించాడు. వేదాలలో విగ్రహారాధన గురించి ప్రస్థావించలేదు. తార్కికమైన మనస్సు విగ్రహారాధనను అంగీకరించజాలదు. భగవంతుడు సర్వవ్యాపి. భగవంతునికి ఒక ఆకారంగానీ, రూపంగానీ లేవు అని వెళ్ళినచోటల్లా ప్రజలకు చెప్పాడు. ప్రత్యేకంగా ఏఒక్క మతాన్నీ సమర్థించడంగానీ, వ్యతిరేకించడంగానీ చేయకుండా ప్రతి ఒక్క మతంలోని లోటుపాట్లను ఎత్తిచూపాడు. శతాబ్దాలుగా



లెండి! మేల్కొనండి! విశ్వవిఖ్యాతమైన



మీ చరిత్రను గుర్తించి - గర్వపడండి. ˀistory.

తరం నుంచి తరానికి వ్యాపిస్తూ వచ్చిన హానికరమైన నమ్మకాలను, దురాచారాలను ఆయన తీవ్రంగా దుయ్యబట్టాడు. వేదాలలో బోధించబడిన సనాతన వైదిక ధర్మం యొక్క గొప్పతనాన్ని వివరించి, దాని పతాకం కింద సమైఖ్యం కావలసిందిగా ప్రజలందరికీ ఎలుగెత్తి పిలుపునిచ్చాడు.

ఆవిధంగా ప్రజలందరిలోనూ వారి వారసత్వం పట్ల చైతన్యాన్ని కలిగించే ప్రయత్నానికి పూనుకున్నాడు. అలా దేశ సంచారం చేస్తూ 1869 అక్టోబర్ 22న కాశీ (బెనారస్)కి చేరుకున్నాడు. కాశీలోని ఉద్దండ పండిత ప్రకండులతో వాద ప్రతివాదనలలో పాల్గొన్నాడు. ఆ సదస్సుకు యాభై నుండి అరవైవేల మంది వరకూ హాజరైనారు. నిర్ణయించిన సమయానికి సదస్సుకు అధ్యక్షుడైన కాశీ మహారాజు ఈశ్వరీ ప్రసాద్ నారాయణసింగ్ తన ఆసనాన్ని అలంకరించాడు. ఒకవైపున ఏకాకిగా స్వామి దయానందుడు ఉన్నాడు. రెండవ వైపున కాశీలోని సువిఖ్యాత శాస్త్రపండితులు ఇరవై ఏడుమంది ఉన్నారు.

శాస్త్రాలను ఎలా వ్యాఖ్యానించాలి అనే విషయంపై చర్చ ప్రారంభించబడింది. వేదాలు విగ్రహారాధనను ఆమోదించాయా? అనేది ప్రశ్న. దయానందుని వాదన ముందు ఆ

పండితులు ఓటమిని అంగీకరించవలసి వచ్చినది. సరిగ్గా అప్పుడే మాధవాచార్యుడనే విద్వాంసుడు రెండు కాగితాలు తీసుకుని వచ్చి ఒక ప్రశ్న అడిగాడు. దయానందుడు కాగితాలను చదువసాగాడు. కొన్ని నిమిషాలు గడిచాయి. అకస్మాత్తుగా కాశీ మహారాజు లేచి 'పండితులు వేసిన ప్రశ్నలకు స్వామి దయానందుడు సమాధానం చెప్పలేకపోయారు' అని ప్రకటించారు. ఆ మాటలు అంటూ మహారాజు చప్పట్లు కొట్టాడు. 'దయానందునివద్ద సమాధానం లేదు. కాశీ పండితులకు జయం! విజయం! దయానందుడిదే పరాజయం' అంటూ కాశీ పండితులు కేకలు పెట్టారు. రౌడీలు దయా నందుడి మీదకు రాళ్ళు, చెప్పులు, ఆవుపేడ వంటివి విసరటం మొదలు పెట్టారు. వాటిలో కొన్ని దయానందుడికి తగిలి గాయాలైనాయి. కొన్ని గాయాలనుండి రక్తం స్రవించింది. పరిపూర్ణ ప్రశాంత స్థితి అందుకుని ఉన్న దయానందుడు అన్నింటినీ సమచిత్తంతో భరించి, ఏమీ జరగనట్లే ఉండి పోయాడు. అయితే కాశీకి చెందిన ప్రధాన పండితులైన తారా చరణ్ తర్కరత్న బాలశాస్త్రి తదితరులు నిజంగానే దయానందుడు చెప్పినది పరిపూర్ణ సత్యం. అయితే ప్రస్తుతమున్న ఆచారాలను

సాంప్రదాయాలను కాదనగలిగే నైతిక స్థైర్యం మాలో లేదు కనుకనే ఆయనను వ్యతిరేకించాలని అనుకున్నాం. అంటూ నిజాయితీగా అందరిముందూ వెల్లడించి లెంపలు వేసుకున్నారు.

శాస్త్రవిషయాల గురించిన చర్చలో తాను పక్షపాత బుద్ధి చూపించినందుకు కాశీ మహారాజు ప్రగాఢ పశ్చాత్తాపాన్ని ప్రకటించాడు. స్వామిదయానందుడిని తన రాజభవనానికి రావలసినదిగా ఆయనను గొప్ప గౌరవభావంతో ఆహ్వానించి, తన అనుచిత ప్రవర్తనకు మన్నించవలసినదిగా ప్రార్థించాడు. కనుక శాస్త్ర విషయాలను సక్రమంగా వివరించే అంశంపై జరిగిన చర్చలో పాండిత్య పరంగానూ, నైతికపరంగానూ కూడా యదార్థంగా ఘనవిజయాన్ని సాధించినవాడు స్వామి దయానందుడే. ఒకే మతపు ఛత్రఛాయల్లో సకల ప్రజానీకాన్నీ సమైక్యం చేయాలన్నదే స్వామి దయానందుని ప్రబల మనోరథం. ఈ లక్ష్యాన్ని సాధించడానికే ఆయన అనవరతం శ్రమించి పనిచేశాడు.

## ఒకే జాతీయ భాష ఉద్యమానికి శ్రీకారం

ఒక సమాజంలోని సభ్యులంతా సమైక్యంగా ఉండాలంటే

అందుకు సామాన్యభాష (Common Language) ఒక మంచి సాధనమని స్వామి దయానందుడు గట్టిగా నమ్మాడు. కనుక హిందీకి జాతీయ భాష స్థానాన్ని కల్పించాలని ఆయన అభిప్రాయపడ్డాడు.

స్వామి దయానందుడు గుజరాత్‌లో పుట్టాడు. గుజరాతీ భాషపై ఆయనకు మంచి పట్టుకూడా ఉంది. అయినప్పటికీ ఆయన గుజరాత్‌లో సైతం గుజరాతీలో కాకుండా హిందీలోనే ఉపన్యాసాలు చేసాడు. తన గ్రంథాలన్నింటినీ హిందీభాషలోనే రచించాడు.

## దేశభక్తుడు

సకల మానవాళి సంక్షేమమే తన లక్ష్యం అయినప్పటికీ మహర్షి దయానందుడుకి తన మాతృభూమిపట్ల అపారమైన ప్రేమాభిమానాలు ఉండేవి. ఒకసారి స్వామి దయానందుడి ఉపన్యాసం విని అమితంగా ముగ్ధుడైన ఇంగ్లీషు అధికారి ఒకడు ఆయనతో స్వామీజీ! మీరు దయచేసి ఇంగ్లాండు వెళ్ళి అక్కడ ధర్మ మార్గాన్ని బోధించండి. ఖర్చులన్నింటినీ నేను భరిస్తాను అన్నాడు. అప్పుడు స్వామి దయానందుడు 'నా

జీవితంలో మిగిలిన కొద్ది సంవత్సరాలలో నాదేశ వాసుల్లో వైదిక జ్ఞానాన్ని ప్రచారం చేసేందుకు ప్రయత్నిస్తాను. ఇక్కడ జ్ఞాన జ్యోతి వెలిగిందంటే దాని కాంతి పశ్చిమదేశాలలో కూడా వ్యాపించడం తథ్యం' అన్నాడు.

విదేశాల్లో తాను ఆర్జించగల కీర్తి ప్రతిష్టల గురించి లవలేశమంతైనా ఆయన ఆలోచించలేదు. తన దేశంలోనే ఉండాలని నిర్ణయించుకుని తన తోటి దేశవాసుల స్థితిగతులను మెరుగుపరిచేందుకే పాటుపడ్డాడు. తన దేశంపట్ల ఆయనకున్న ఎల్లలులేని ప్రేమాభిమానాలకు ఋజువు ఇదే. ఒకసారి ఒక సభలో అసంఖ్యాక మనుషులనుద్దేశించి ప్రసంగిస్తూ మీ పూర్వీకులు అరణ్యాలలో నివసించిన అనాగరిక మనుషులు కారు. ఈ ప్రపంచానికే జ్ఞానభిక్షను పెట్టిన మహనీయులు వారు. మీ చరిత్ర పరాజయాల మోపుకాదు. విశ్వవిజేతల యశోగానమది. మీ వేదవేదాంగ శాస్త్రాలన్నీ ఆవులకాపరుల ఆలాపనలు కావు. శ్రీరాముడు, శ్రీకృష్ణుల వంటి మహా మహితాత్ములను రూపుదిద్దిన అమృత సత్యవచోనిధులవి. లేవండి! మేలుకొనండి! వైభవోపేతమైన మీ చరిత్రను చూసి సగర్వభావంతో పులకించండి. ఆ చరిత్రనుండి స్ఫూర్తి పొంది

వర్ధమానానికి రూపురేఖలు మలచండి. మీ పూర్వీకుల పట్ల జుగుప్సను నింపుతున్న ఆధునిక విద్యావిధానం సిగ్గుచేటని గ్రహించండి. అని స్వామి దయానందుడు సింహగర్జన చేసాడు.

## సాయుధ విప్లవ సందేశ ప్రదాత

స్వామి దయానందుని దేశభక్తి వట్టి వాక్శూరత్వం కాదు. ఆయన ధీర కార్యాచరణ శీలుడు కూడా. 1857లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామం సఫలం కాలేకపోయింది. 1885లో భారతజాతీయ కాంగ్రెస్ అవతరించింది. 1857 నాటి వైఫల్యం తరువాత కాంగ్రెస్ స్థాపన జరిగే వరకూ భారతీయుల హృదయాలలో స్వాతంత్ర్య ప్రేమజ్వాలను ఆరిపోనీయకుండా నిలిపి ఉంచిన ధీరవరేణ్యులలో స్వామి దయానందుడు ఒకడు. అందుకు గానూ ఆయన ఆసేతు శీతాచలం పర్యటించాడు. దేశంలోని వివిధ సంస్థానాల అధిపతులనందరినీ ఒకే త్రాటిమీదకు తెచ్చేందుకు ప్రయత్నం చేసాడు. ఆ ప్రయత్నంలో భాగంగానే జోధ్‌పూర్, ఉదయపూర్, షాహపూర్ మొదలైనచోట్ల అనేక ఆర్య సమాజ శాఖలను సంస్థాపించాడు. పలువురు సంస్థానాధీశులు ఆయనకు శిష్యులుగా మారారు. బ్రిటీషువారిని

భారతదేశం నుండి తరిమికొట్టడానికి సాయుధ విప్లవం ఒక్కటే శరణ్యమని స్వామి దయానందుడు సంపూర్ణంగా విశ్వసించాడు. కనుకనే ఆయన శ్యాంజీ కృష్ణవర్మ అనే ప్రసిద్ధ విప్లవకారుణ్ణి ప్రేరణ పొందేందుకు, తన కార్యసాధనకు అవసరమైన శిక్షణ పొందేందుకు ఫ్రాన్స్ దేశానికి పంపించాడు.

దయానందుడు స్థాపించిన ఆర్యసమాజం, గురుకులాలు దేశభక్తులను తయారుచేసి సాయుధ విప్లవం కోసం వారికి శిక్షణను, ప్రేరణను ఇచ్చాయి. బ్రిటిషు వారిని భారతదేశం నుండి వెళ్ళగొట్టేందుకు బహిరంగంగా పోరాటం సాగించిన స్వామి శ్రద్ధానంద, భాయి పరమానంద, లాలాలజపతిరాయ్, లాలా హరదయాళ్‌లు ఆర్యసమాజీయులే. గెందాలాల్ దీక్షిత్, రోషన్‌లాల్, రాంప్రసాద్ బిస్మిల్ వంటి ప్రసిద్ధ యువ క్రాంతికారులు తాము ఆర్య సమాజీయులమని సగర్వంగా చెప్పుకునేవారు.

బ్రిటిషువారు మొదటి నుంచి స్వామి దయానందుని అనుమానిస్తూనే ఉన్నారు. కనుకనే స్వామీజీ ఎక్కడకు వెళ్ళినా గూఢచారుల బృందం ఆయనను వెన్నంటి ఉండేది. జోధ్‌పూర్‌లో

స్వామీజీపై జరిగిన విషప్రయోగంలో బ్రిటిష్‌వారి హస్తం ఉన్నట్లు ఋజువైంది.

## ఉక్కుమనిషి

స్వామి దయానందుడు అద్భుతమైన శరీర సౌష్ఠవం కలవాడు. ఆయన కాసాగంజ్‌లో ఉన్నపుడు జరిగిన ఒక సంఘటన ఆయన అసాధారణ దేహ దారుఢ్యం ఎటువంటిదో నిరూపించింది.

ఒక వీధిలో రెండు బలిష్ఠమైన ఆబోతులు ఒకదానితో ఒకటి తలపడి కుమ్ముకోసాగాయి. వందలాదిమంది భయంతో ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని దూరాన నిలిచి ఆ కుమ్ములాటను చూస్తున్నారు. ఎంతసేపు గడిచినా ఆ కుమ్ములాట ముగింపుకు వచ్చే సూచనలు కనిపించలేదు. స్వామి దయానందుడు జనాన్ని తోసుకుంటూ ఆబోతుల దగ్గరకు చకచకా వెళ్ళసాగాడు. అది గమనిస్తున్న ప్రజానీకం భీతావహులై స్వామీజీ! వాటి దగ్గరకు పోతే మీరు బ్రతికి బట్టకట్టలేరు. వెనక్కురండి! అని కేకలు వేసారు. అయితే స్వామీజీ వారి మాటలను పట్టించు కోలేదు. ఆయన ఆబోతులను సమీపించాడు. అకస్మాత్తుగా

ఒడిసి ఫట్టుకుని ప్రచండమైన శక్తితో వాటిని త్రోసిపారవేసాడు. ఆబోతులు వెనుదిరిగి చూడకుండా చెరియొక దిక్కుగా వెళ్ళిపోయాయి. మొండి సన్యాసిలోని మానవాతీత శక్తిని చూసి చుట్టూ ఉన్న ప్రజానీకం విస్మితులైనారు.

ఈ మానవాతీతమైన శారీరక శక్తి కారణంగానే దయానందుడు భయంకరమైన విషాన్ని త్రాగిన తర్వాత కూడా నెలరోజులపాటు సజీవుడై ఉండగలిగాడు.

## సంఘసంస్కర్త

సన్యాసి అయినప్పటికీ దయానందుడు సున్నితమైన దయార్ద్రమైన హృదయం కలవాడు. పేదవారు పడే కష్టాలకు ఆయన హృదయం వెన్నలా కరిగిపోయేది. భగవంతుని సృష్టిని ప్రేమించడమంటే భగవంతుని ప్రేమించటమే అని ఆయన ప్రజలకు బోధిస్తుండేవాడు.

ప్రజలను అలసత్వం నుండి మేలుకొలిపేందుకై ఆయన యావద్భారతం సంచరించాడు. ఎక్కడకు వెళ్ళినా కులవ్యవస్థను, విగ్రహారాధనను, బాల్య వివాహాలను, ఇతర హానికర సంప్రదాయాలను, దురాచారాలను తెగనాడాడు. మహిళలకు పురుష

లతో సమానమైన హక్కులుండాలని బోధించాడు. జీవితాన్ని పవిత్రంగా గడపవలసిన అవశ్యకతను నొక్కివక్కాణించాడు.

ఆయన ఉద్బోధ ప్రజలలో ఒక సంచలనాన్ని సృష్టించింది. శతాబ్దాలమీద కాలక్రమంలో హిందూ మతంలోకి కొన్ని దురాచారాలు చొచ్చుకువచ్చాయి. ఈ ఆచారాలు ప్రాధాన్య తను సంతరించుకొనటంలో హిందూ మతపు ఘనత కొడి గట్టింది. స్వామి దయానందుని బోధనలతో యదార్థమైన హిందూ ధర్మం వెలుగులు విరజిమ్మసాగింది. పాశ్చాత్య సంస్కృతి ప్రభావంలో పడి క్రైస్తవ మతం పుచ్చుకునేందుకు ఉద్యుక్తులైన వేలాదిమంది యువజనులు వెనుదిరిగి చూసుకుని నిష్ఠాగరిష్ఠులైన వైదిక ధర్మానుయాయులుగా మారారు. ఒకప్పుడు హిందువులుగా ఉండి ఇతర మతాలను ఆశ్రయించిన వారిలో తిరిగి తమ పూర్వపు హిందూ మతాన్ని స్వీకరించాలన్న అభిలాష కలిగింది. అయితే హిందువులు ఇందుకు అనుమతిం చటంలేదు. క్రైస్తవ, ఇస్లాం మతాలలోకి మారినవారికి స్వామి దయానందుడు శుద్ధికార్యం జరిపించి వారిని మరల హిందూ ధర్మంలోకి తీసుకువచ్చాడు. కనుక భారతీయుల సాంఘిక జీవనంలో స్వామి దయానందుడు ఒక విప్లవాన్ని తెచ్చాడని చెప్పవచ్చు.

స్త్రీల సమానత్వం గురించి ఆయన ప్రత్యేకంగా నొక్కి చెప్పాడు. స్త్రీలకు విద్యావకాశాలను నిరాకరించి వారిని అజ్ఞానంలో ఉంచిన కారణంగానే భారతదేశం ఇంతటి దురదృష్టకరమైన హీనస్థితిలోకి దిగజారిపోయిందని ఆయన చెబుతుండేవాడు. పరదావంటి మూఢాచారాలకు స్త్రీలులోనై ఉన్నంతకాలం అద్దంలో కనిపించే ఆభరణాల ప్రతిబింబాలవలే పురోగతి అనేదికూడా చేతికి అందనే అందదు. వారు పరదా లను తీసి పారేయాలి. సీత, సావిత్రి వంటి వారిని గుర్తుంచు కున్నామంటే వారి పవిత్రత, సౌశీల్యాల కారణంగానే తప్ప వారు పరదాల వెనుక ఉన్నవారు కాదు, అంటూ ప్రబోధం సాగించాడు.

విద్యావ్యాప్తి జరగనిదే జాతి వర్ధిల్లటం అసంభవమని పూర్తిగా విశ్వసించాడు స్వామి దయానందుడు. అయితే మన విద్యావిధానం పాశ్చాత్య తరహా విద్యకు వట్టి కార్బన్‌కాపీ మాదిరిగా ఉండకూడదు. ఎనిమిదేండ్లు వచ్చిన ప్రతి బాలుణ్ణీ, బాలికనూ పాఠశాలకు పంపేందుకు తల్లిదండ్రులను నిర్బంధం చేసేవిధంగా ఒక చట్టం ఉండాలి. ప్రతి బాలుణ్ణీ, బాలికనూ గురువులతో కలిసి ఉంటూ విద్యాభ్యాసం చేసేందుకు గురు కులాలకు పంపాలి. బాలబాలికలకు వేరువేరుగా గురుకులాలు

ఉండాలి. రాజకుమారుడైనా, రైతుబిడ్డైనా గురుకులంలో అందరూ సమానంగా ఉండాలి. వారంతా కలసి పనిచేసే విధంగా చేయాలి. గురుకులం పట్టణ, నగర జనవాసాలకు సుదూరంగా నిర్మల ప్రశాంత వాతావరణంలో విరాజిల్లాలి. వేదాలవంటి మన మహోన్నత గ్రంథాలను, మన సంస్కృతిని విద్యార్థులకు పరిచయం చేయాలి. దానితోపాటే ఆధునిక జీవితానికి ఆవశ్యకాలైన గణితశాస్త్రం, భూభౌతిక శాస్త్రం, ఖగోళశాస్త్రం ఇత్యాది వైజ్ఞానిక శాస్త్రాలను కూడా బోధించాలి. ఈ లక్ష్యాలను సాధించేందుకై స్వామి దయానందుడు పలుచోట్ల గురుకులాలను స్థాపించాడు. వాటిలో కాంగడీ గురుకులం ఈనాటికీ వన్నె తరగకుండా విఖ్యాతమై ఉంది.

## ఆర్యసమాజ సంస్థాపకుడు

తాను ఆరంభించిన సంఘ సంస్కరణ కార్యక్రమం తన మరణానంతరం కూడా నిరంతరాయంగా కొనసాగాలని దయానందుడు అభిలషించాడు. కనుక 1875 ఏప్రిల్ 10వతేదీన ముంబైలో 'ఆర్యసమాజ్' అనే సంస్థను నెలకొల్పాడు. అది క్రమంగా ఒక మహాసంస్థగా భారతదేశ తీరాలను కూడా

దాటి విస్తరించింది. లక్షలాది మంది హిందువులు ఆర్య సమాజం చేత ప్రభావితులైనారు. తమ ధార్మిక కేంద్రాలు, గురుకులాలు, పాఠశాలలు, కళాశాలలు, మహిళా విద్యాలయాలు, అనాధాశ్రమాలు వితంతు శరణాలయాలు వంటి వాటిద్వారా ఆర్యసమాజం ప్రజలకు అపారమైన అసమానమైన సేవలను అందించింది.

## సత్యార్థ ప్రకాశం - మహా గ్రంథం

స్వామి దయానందుని 'సత్యార్థ ప్రకాశం' అనే గ్రంథం జాతికి ఆయన ప్రసాదించిన మరొక అపూర్వ వరం. అందులో పద్నాలుగు అధ్యాయాలున్నాయి. అదొక మహా గ్రంథం. వేదాలయొక్క సత్యమైన అర్థాన్ని విశదీకరించేది కావటంవల్ల దానిని 'సత్యార్థ ప్రకాశం' అన్నారు. కేవలం వేదాలమీదనే ఆధారపడి రచించిన గ్రంథమది.

స్వామిదయానందుని బోధనలన్నీ ఈ గ్రంథాలలో సుస్పష్టంగా వివరించబడ్డాయి. తన బోధనలకు వేదాల మద్దతు ఉన్నదని ఆయన నిరూపించాడు. హానికరమైన సంప్రదాయాలను దురాచారాలను అవి హిందువులపైనా, అన్య మతాల అనుయాయులపైనా ఈయన ఎత్తిచూపాడు. తమ బానిసత్వాన్ని

వదిలించుకోవాలని భారత ప్రజానీకానికి ఆయన వీరోచితమైన పిలుపునిచ్చాడు. ఏమతమైనా మనిషికి మరణానంతరం ముక్తిని సాధించే పద్ధతిని బోధించడంతో సరిపెట్టుకోకూడదని, ఈ లోకంలో పదిమందికీ ఉపయోగపడే విధంగా ఎలా జీవించాలో కూడా అతనికి మార్గదర్శనం చేయాలని ఆయన ప్రకటించాడు. వైదిక మతం ప్రతి మనిషికీ ధర్మాధర్మ కామ మోక్షాలు అనే చతుర్విధ పురుషార్థాలను ముందుంచి సన్మార్గాన్ని చూపించిందని చెప్పాడు.

ఆనాటి ప్రజలకు వేదాలగురించి బొత్తిగా తెలియదు. సామాన్య ప్రజానీకంలో ఈ అజ్ఞానాన్ని పారద్రోలేందుకు స్వామి దయానందుడు అమితంగా శ్రమించాడు. 'మానవుడి ప్రధాన లక్ష్యం మోక్షాన్ని సాధించడమే అయితే ఈ భూమిమీద యోగ్యమైన రీతిలో మనం జీవించలేకపోతే మనం మోక్షాన్ని సాధించడమనేది కల్ల' అనేదే ఆయన బోధ. ఈ బోధనకు మద్దతుగా ఆయన వేద సూక్తులను ఉటంకించేవాడు. వేదాలవైపు మరలవలసిందిగా ఆయన ప్రజలకు ఉద్బోధించాడు.

## భయమంటే ఎరుగని సన్యాసి

స్వామిదయానందుడు భయమంటే ఎరుగని సన్యాసి. తాను

సత్యమని నమ్మినదానిని నిర్భయంగా చాటేవాడు. ఒకసారి షల్‌బ్రెథ్ అనే మతాధికారి 'నీవు క్రైస్తవ మతాన్ని విమర్శిస్తే జైలుకు పోవలసి వస్తుంది, అని ఆయనను బెదిరించాడు. వెంటనే దయానందుడు "మిత్రుడా! సత్యాన్ని చెప్పినందుకు జీసను క్రీస్తునే శిలువ వేసారుకదా! అయితే సత్యాన్ని చెప్పేం దుకు ఎవరిని చూసీ నేను భయపడను" అని జవాబిచ్చాడు.

స్వామిదయానందుడు హిందూ మతంలోని దోషాలను ఎత్తిచూపినట్లే ఇతర మతాలలోని దోషాలనూ ఎత్తిచూపుతుండే వాడు. ఈ కారణంగా ఈయన చాలాసార్లు పరమతాను యాయుల ఆగ్రహానికి గురికావలసి వచ్చింది. ఒకసారి జోధపూర్‌లో ఒక సమావేశంలో ఆయన బోధిస్తుండగా ఆసంస్థానపు దివానుగారి బంధువు ఒకడు తన ఖడ్గంమీద చేయి వేసి "జాగ్రత్తగా ఉండు. మా మతాన్ని విమర్శించకు" అన్నాడు. "నిన్ను ముక్కలు ముక్కలుగా నరకాలి" అని కూడా దివాన్ అన్నాడు.

అందుకు స్వామి దయానందుడు "ఎక్కడ నాకు దోషాలు కనిపించినా వాటిని ఎత్తి చూపుతాను. "నీలాంటి నక్కల ఊళలకు భయపడేందుకు నేనేం కుందేలును కాదు" అంటూ

తన మతంలోని దోషాలను కూడా దయానందుడు ఎత్తిచూపి కఠినంగా విమర్శించాడు.

## విషం ఇచ్చిన వ్యక్తిపై కారుణ్యం

భగవంతునికి రూపమనేది లేదని, కనుక విగ్రహాలను ఆరాధించరాదని దయానందుడు వాదించాడు. ఈ వాదం హిందువుల్లో అత్యధికులకు ఆమోదయోగ్యం కాదు. అయితే వారిలో ఆయన వాదానికి ప్రత్యుత్తరం ఇవ్వగలవారు ఎవ్వరూ లేరు. అందువల్ల వారిలో కొందరు ఆయనను హత్య చేసేందుకు రహస్యంగా పథకం వేయసాగారు. హిందూమతంలో నుండి ఇతర మతాల్లోకి మారిన వేలాదిమంది దయానందుడు ప్రతిపాదించిన శుద్ధి కార్యక్రమంతో తిరిగి హిందూ ధర్మంలోకి వచ్చి చేరారు. ఇది ఆయా మతాలవారికి కోపం కలిగించింది. ఇలా దయానందుడికి ఇటు తన స్వంత మతాలవారి నుండి, అటు పరమతానుయాయుల నుండి కూడా ముప్పు ఏర్పడింది. దీనితో ఆయన అడుగడుగునా ప్రమాదాలతో నిండిన మార్గాన పయనించవలసి వచ్చింది.

అనూపశహర్ అనే చోట ఒకానొక హిందువు స్వామీజీని

వంచించి విషం నింపిన కిళ్ళీని యిచ్చాడు. తనపై విషాన్ని ప్రయోగించారన్న సంగతి కొంతసేపటి తర్వాత దయానందుడు గ్రహించాడు. వెంటనే ఆయన గదికి వెళ్ళి యోగక్రియ సహాయంతో తాను తిన్న ఆహారాన్నంతటినీ వాంతి చేసుకుని ప్రాణాన్ని కాపాడుకున్నాడు. అప్పటికీ తనకు విషాన్నిచ్చిన వ్యక్తిని ఒక్కమాట కూడా అనలేదు. అయితే హిందువులు తమ యదార్థ శ్రేయోభిలాషిని అర్థంచేసుకోలేక పోయినందుకు విచారపడ్డారు. ఆ ప్రాంతానికి తహసీల్దారు అయిన సయ్యద్ సాహెబ్ దయానందుని భక్తుడే. జరిగిన విషయం తెలుసుకుని అతడు విషాన్నిచ్చిన వ్యక్తిని అరెస్టు చేసాడు. ఈ విషయం తెలిసిన దయానందుడు కోపపడి, అయ్యా! నేను ప్రజలను బంధవిముక్తులను చేసేందుకే ఇక్కడకు వచ్చాను తప్ప ఎవరినీ బంధించడానికి రాలేదు అన్నాడు. ఈ మాటలు విన్న సయ్యద్ సాహెబ్ చలించిపోయి కన్నీరు కార్చాడు. దయామయుడైన స్వామీజీ "దయానందుడు" అనే పేరుకు అన్నివిధాలా అర్హుడని ఆయన భావించాడు.

చివరకు హంతకులదే పైచేయి అయింది. ఒకసారి దయానందుడు జోధ్‌పూర్ వెళ్ళాడు. ఆ సంస్థానానికి అధిపతి అయిన

మహారాజా జస్వంత్‌సింగ్ ఒక దుష్టుడు. అతడు నన్హీజాన్ అనే అమ్మాయితో ప్రేమాయణం సాగిస్తూండేవాడు. తన ప్రవర్తనతో మహారాజు చాలా సార్లు ప్రజల దృష్టిలో ప్రతిష్ట పోగొట్టుకున్నాడు. మహారాజు చర్యలు అనైతికమైనవి, లజ్జాకరమైనవని అతనితో దయానందుడు స్పష్టంగా చెప్పాడు. ఫలితంగా నన్హీజాన్ స్వామీజీపై తీవ్రమైన ద్వేషాన్ని పెంచుకున్నది.

అది 1883 సెప్టెంబరు 20వ తేదీ రాత్రి. స్వామీజీ ఎప్పటి లాగానే పాలు త్రాగి పడుకున్నాడు. దాదాపుగా అర్ధరాత్రి వేళ కడుపులో తీవ్రమైన బాధ అనిపించింది. బాధలో మేలుకున్న దయానందుడు తన కడుపులో విషం ప్రవేశించినట్లు గ్రహించాడు. వెంటనే ఆయన రెండుసార్లు వాంతిచేసుకున్నాడు. అయినా లాభంలేకపోయింది. అప్పటికే ఆ విషం రక్తంలోకి ప్రవేశించి దేహమంతా వ్యాపించింది. దానివల్ల కడుపులోను, ఛాతీలోనూ మంట మొదలైంది. మరునాడు డా. అలీమర్దాన్ ఖాన్ అనే డాక్టరును పిలుచుకువచ్చారు. అయితే ఆయన ఇచ్చిన మందుతో దయానందుడి పరిస్థితి మరింత విషమించింది. శరీరమంతటా పుండ్లు పడ్డాయి. రక్తం స్రవించసాగింది. ఈ నరకయాతన కొన్నిరోజులపాటు అలాగే

కొనసాగింది. మహారాజు కూడా ఎంతో విచారపడ్డాడు కానీ ఆయన చేయగలిగిందేమీ లేదు. అయినప్పటికీ ఆయన దయానందుణ్ణి చికిత్స నిమిత్తం వేరొక ప్రదేశానికి తరలించాడు. ఆ సమయంలో కొంత దూరం వరకూ మహారాజే స్వయంగా పల్లకీ మోశాడు.

ఒక రోజున చుట్టుప్రక్కల ఎవరూ లేని సమయంలో దయానందుడు తన వంటవాడైన ధౌల్ మిశ్రాను పిలిచాడు. దయానందుని శరీరంనుంచి స్రవిస్తున్న రక్తాన్ని చూసి అతడు దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. "నేను ద్రోహుల మాటలు విని మీ పాలలో గాజుపొడిని కలిపి ఇచ్చాను. దేవుడా! ఎంత ఘోర పాపానికి ఒడిగట్టాను! నన్ను క్షమించండి" అంటూ పెద్దపెట్టున రోదించాడు. దయానందుడు "ఇది నా ప్రారబ్ధం నీతప్పేముంది" అంటూ అతనిని ఓదార్చాడు. ఆతరువాత అతని చేతుల్లో రెండు వందల రూపాయలు పెట్టి ఈ సంగతి మహారాజుకు తెలిస్తే నీవు ఇబ్బందుల్లో పడతావు. కనుక దూరంగా నేపాల్‌కు వెళ్ళిపోయి అక్కడ రహస్యంగా గడుపు. నీ ప్రయాణ ఖర్చులకోసం ఈ డబ్బు నీదగ్గర ఉంచుకో అని చెప్పి వంటవాణ్ణి సురక్షిత ప్రదేశానికి పంపివేసాడు.



నేపాల్‌కు వెళ్ళిపోయి అక్కడ రహస్యంగా గడపమని,
ఖర్చులకోసం డబ్బిస్తున్న దయానందుడు.

దయానందుడు గొప్ప తత్త్వవేత్త, తర్కశాస్త్రంలో ఉద్దండ పండితుడు, అద్భుత ఉపన్యాసకుడు, మహారచయిత, సంఘసంస్కర్త, దేశభక్తుడు, వితరణశీలి, మహర్షి, సాయుధ విప్లవ వైతాళికుడు, సచ్ఛీలము, సత్ప్రవర్తనలే తానుగా మూర్తీభవించినవాడు, స్వతంత్రముగా, నిర్భయంగా ఆలోచించడాన్ని ప్రజలకు నేర్పినవాడు.

దయానందుడు ఒక మహర్షి. యోగసాధన ద్వారా తనకు సంక్రమించగల మహదానందాన్ని ఈయన త్యాగం చేశాడు. మానవాళి శ్రేయస్సు కోసమై అత్యంత కఠిన జీవితాన్ని స్వీకరించాడు. కాని దీనికంతటికీ ప్రతిఫలంగా ఆయన పొందినదేమిటి? దెబ్బలు, అవమానాలు, దూషణలు, విషప్రయోగాలు. ఇదంతా ఆయన చిరునవ్వులతో స్వీకరించాడు. సర్వదా మానవజాతి శ్రేయస్సునే ఆకాంక్షించాడు ఆమహర్షి



# ఆర్యసమాజ నియమములు



- సమస్త సత్యవిద్యలకును విద్యవలన నెఱుంగదగు సర్వ పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.

- ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తివంతుడు, న్యాయకారి, దయాళువు, అజన్ముడు, అనాది, అనంతము, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.

- వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట, వినుట, వినిపించుట, ఆర్యులకందఱకు పరమ ధర్మము.

- సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలయును.

- సకల కార్యములను ధర్మానుసారముగా అనగా, సత్యాసత్యములను విచారించి చేయవలయును.

- ప్రపంచమునకు ఉపకారము చేయుట, ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము. అనగా శారీరకోన్నతికి, ఆత్మోన్నతికి మఱియు సామాజికోన్నతికి పాటుపడవలయును.

- అందరితో ప్రేమమపూర్వకముగా, ధర్మానుసారముగ, యథాయోగ్యముగ వ్యవహరింపవలయును.

- అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింప జేయవలయును.

- ప్రతి వ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తినొందక అందఱి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంపవలయును.

- సమస్త మానవులు సర్వహితకరములగు సామాజిక నియములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తిహితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.